Registered No. M-4484.

# యుద్ధ సంచిక.

వాల్యుం II.] 1942 వ సం॥ జూన్ నెల 26 వ తేది శుక్రవారం [నె 25 రు.

## యుద్ధ విమర్శ - విశేషాలు.

### రాజ సోదరునిరాక - పశిఫిక యుద్ధమున మార్పు - జపాను శక్తి సన్నగిల్లుట - టోబ్రుక్ పతనం.

గ్లష్టరు ప్రభువు.

బ్రిటిషు రాజుగారి సోదరుడగు గ్లష్టరు ప్రభువు ఇండియా సైనిక యేర్పాటులను చూచుటకు సంచారం చేయుచు మదరాసులో ఐలండు మైదానమునందు ఎ.ఆర్.పి., సెంటు జాను ఆంబులెన్సు బ్రిగేడు దళముల ప్రదర్శనమును గత ఆదివారం ఉదయం చూచిరి, అంతేకాక మదరాసు నగరాన్ని రక్షింపనున్న భారతీయ, ఆంగ్లేయ, ఆంగ్లో ఇండియను సైనిక దళములను వారి ఏర్పాటులనుగూడ పరీక్షించిరి. మదరాసు సేపర్లు మైనరులనుగూడ జూచిరి.

ఘనతవహించిన హైదరాబాదు నవాబుగారి సంస్థానంలో సంచారం ముగించివచ్చినందున, మదరాసునుంచి నైజాముగారికి సందేశం పంపుచు ప్రభువుగారు యిట్లు తెలిపిరి:—నేను కొద్దికాలమే మీ సంస్థానంలోనున్నను, ప్రపంచ చరిత్రయందు క్లిష్టసమయమునందు రాగల్గుట నాయదృష్టమే. ఎన్నడెరుంగనంత భీకరయుద్ధం తీవ్రంగా జరుగుచూవున్న సమయంలోరావడంవలన నిజమయిన భక్తి భ్రాతృభావములను తెలుసుకొనుటకు వీలగును. ప్రశాంతమయిన నౌకాయానంలోకాక, తుపాను సమయములందే నావికుల ఐకమత్యం నేర్పు తెలియగలదు.'' హైదరాబాదులో యీ యుద్ధ ఫలితంగూర్చి సంపూర్ణ విశ్వాసం కలిగియున్నారనియు, మిత్రమండలియందు చెక్కు చెదరని భక్తి కలిగియున్నారనియు—అది ఇండియాలో నరేంద్రులు, వారిసంస్థానముల మనోభావమునకు సరియైన నిదర్శనమనియు, ప్రభువుగారు తెలిపిరి. "ఈ భావం కలిసిపోరాడుచున్న సహచరుల హృదయముల నుప్పొంగజేసి, చివరకు శత్రువులను గాభరాపెట్టును.''

గ్లష్టరు ప్రభువుగారివలె భారత సంస్థానాధీశులు బ్రిటిషు ఇండియా ప్రజలుగూడ భావించుచున్నారు. ఉభయులును అక్షరాజ్యాల ఓటమిని గాఢంగా కోరుచున్నారు.

పశిఫికు యుద్ధంలో మార్పు.

పశిఫికు సముద్రమునందు మిడ్వేద్వీపంలో జరిగిన యుద్ధం పశిపికు రంగమున యుద్ధగతిని మార్చివేయునట్టిది. ఇచట అమెరికా నౌకా దళము జపాను యుద్ధ నౌకలకు చాల నష్టం కలిగించినది. జపానువారి విమాన వాహక నౌకలు రెండు లేక మూడు మునిగిపోయినందున జపానువారి విమాన "ఛత్రం" చితికిపోయింది. వాటిని ముంచిన తరువాత అమెరికను వైమానికులు రక్షణ లేకయున్న యుద్ధ నౌకలను పెక్కింటిని ముంచివేసిరి. కుంటువడిన యుద్ధనౌకలు ఎన్ని జపాను రేవులు చేరినవో తెలిస్తేగాని, వారికి పూర్తిగ ఎంతనష్టం కలిగిందో చెప్పవీలులేదు. కోరలు సముద్ర యుద్ధంవలెనే మిడ్వేద్వీపం యుద్ధంకూడ, దిగువ పెద్ద ఫిరంగులకు అందకుండా చాలఎత్తున విమానాల మధ్య జరిగినట్లుంది. మహా సముద్రాలపై యుద్ధములందు తనకు ఎక్కువగనున్న విమాన వాహక నౌకలపైనే జపాను ఆధారపడియుండెనని, యీ యుద్ధంలో యివి పోయినాక అనుసరించిన పద్ధతులవలన, విదితమయినది.

మిడ్వేద్వీప యుద్ధం ఫలితంగా అమెరికా నుండి క్రొత్త సహాయం పడమటి పశిఫికు దీవులకు పంపబడునని తెలియుచున్నది. ఇదివరకు పంపక యిప్పుడేలాగు పంపగలరని అడుగవచ్చును. అదివరకు అమెరికా పడమర తీరం రక్షణకై కొన్ని బాంబరు విమానాలు ఫైటరు

విమానాలు అచట నిలిపియుంచిరి. ఇపుడు మిడ్వేవద్ద జపానువారి విమాన వాహక నౌకా దళం నాశనమయినందున, అవి అక్కడనుండి రావచ్చును. జపాను మూడు పనులు చేయ ప్రయత్నించుచుండెను—(1) అమెరికానుండి సామోవామీదుగా ఆస్ట్రేలియాకు సరకు రవానా మార్గం తెగగొట్టుట, (2) మిడ్వేదీవంలోను, యితర అమెరికను దీవులలోను ఉన్న సైనిక శిబిరాలను నిరుపయోగం చేయడం, (3) అమెరికనులు అలూషియను దీవులను కేంద్రాలుగా నుంచుకొని జపానుపై దాడిచేయకుండా చేయడం. జపానువారు తిరిగి తమ నౌకాదళం విమాన దళం వృద్ధిచేసుకొని లోటు తీర్చుకుంటే తప్ప, యీ మూడు కార్యాలలో నేదీసాధించలేరు ; పశిఫికు సముద్రంలో ' ఆత్మరక్షణ యత్నములందే యుండాలి. ఈ సమయంలో అమెరికనులు జపానుపై తిరుగుదాడి చేసినచో మిడ్వేద్వీప యుద్ధమే పశిఫికు యుద్ధముఖం త్రిప్పివేయు ఘట్టంగా నెంచబడగలదు.

జపాను శక్తి తగ్గింది.

మిడ్వే యుద్ధంలో ఓటమివలన జపానువారి నౌకాదళానికి కొన్ని నెలల వరకు తిరిగి కొట్టే శక్తి తగ్గిపోయింది. 1942 వ సం॥ జూను 12 వ తేదివరకు జపాను నౌకా దళానికి కలిగిననష్టాలగూర్చి అమెరికా నౌకా దళంవారు సంఖ్యలు ప్రకటించిరి ; 51 యుద్ధ నౌకలు మునిగి 43 కుంటువడినవని రూఢిగా తెలిసెను. సందేహంగానున్నవి 110. వర్తక నౌకలు, 122 మునుగుటో చెడుటో జరిగెను, 51 యుద్ధ నౌకలు మునుగుట మాత్రమే లెక్కించి చూచినా, 1941 వ సం॥ డిసంబరు 7 వ తేదిన అంచనా వేయబడిన జపాను నౌకా శక్తి 10,00,000 టన్నులలో $\frac{1}{8}$ వ వంతు తగ్గిపోయింది.

జపాను యుద్ధం ప్రారంభించినపుడు దానికి 202 అన్ని రకాల నౌకలు యుండెను. అందు అమెరికావారు 4 విమాన వాహక నౌకాలను, 11 క్రూయిజరులు, 17 డిస్ట్రాయరులు, 6 జలాంతర్గాములను, అనగా మొత్తం 38 రూఢిగా ముంచివేసిరి. అనగా నూటికి 15 వంతు చెడగొట్టబడినవి. ఇంకో నూటికి 19 4 వంతుకూడ చెడగొట్టబడినట్లు ఎంచబడుచున్నది. అనగా జపానువారి కొట్టే శక్తిలో $\frac{1}{3}$ వంతు స్థిరంగా ముంచివేయబడుటో, తాత్కాలికంగా కుంటువడుటో జరిగెను.

పశిఫికు సముద్ర యుద్ధఫలితం నౌకాదళ శక్తిపై ఆధారపడియున్నది. కోరలు సముద్రం మిడ్వేదీవులంను యుద్ధంలో అమెరికనులు నేల దిగే విమానాలనే ఎక్కువగ నుపయోగించి విజయం పొందిరి. అట్టి విమానాలలో అమెరికాదే పైచేయి జపాను నౌకా దళం యీ రేటులో నష్టపోతూవుంటే అమెరికా పశిఫికు నౌకా దళం తమ విమానాల బారిని దాటి తిరుగు దాడిచేయ కల్గును. విమానశక్తి నౌకా శక్తి రెండు కలిపి ఉపయోగించుటచే నైరుతి పశిఫికునందు కొన్ని ప్రాంతములను జపాను సంపాదించగల్గెను. గెల్చుకొన్న యీప్రాంతాలను కాపాడుకొనుట నౌకా బలంపై ఆధారపడియుండును. మిత్రమండలి విమానశక్తి, నౌకాశక్తి త్వరగా పెరుగుచున్నది, కావున జపాను నౌకా మార్గాలు సరికట్టబడును. జపాను యుద్ధనౌకలు కాపలాపనుల మీద చెదరియుండక తప్పదు. అపుడు జపాను నౌకా శక్తి అణచివేయుట సులభమగును. ఈ కార్యమునకు మిడ్వేయుద్ధం బాగా తోడ్పడెను. ఇచట జపానువారి ఓటమి, పశిఫికు మధ్యభాగమునందు వారి సత్వర కార్యమును భగ్నమొనరించుటేగాక, యితర ప్రాంతాలలో వారు పెద్ద దాడి చేయు అవకాశముకూడ తగ్గించెను.

లిబియా యుద్ధం

లిబియా యుద్ధంగూర్చి, టోబ్రుకు పతనం గూర్చి బ్రిటిషు కామన్సు సభలో డిప్యూటీ ప్రధాన మంత్రి ఆట్లీగారి ప్రకటనలో విమర్శగ తెలిపిరి. టోబ్రుకునందు వీరులు పెక్కండ్రను గోల్పోయినందుకు ప్రభుత్వంవారు చాల విచారించుచున్నారని చెప్పి, దక్షిణాఫ్రికా సేనలు పోయినందుకు ఫీల్డుమార్షలు స్మట్సుగారికి సానుభూతి తెలిపిరి. అచట సేనానాయకుడుగనున్న జనరలు అచినులేకుగారి లేఖను సభలో చదివిరి. యుద్ధంలో ఒకమాటు శత్రుదాడి నిలచిపోయిందనియు, అవుడు తాము సమయంచూచి కొట్టియున్నచో ఫలితం యింకోవిధంగానుండేదనియు ; కాని మిత్రమండలి సైనికులుగూడ చాల అలసియున్నందున అవకాశం ఉపయోగించుకో లేక పోయిరనియు, అచినులేకుగారు వ్రాసిరి. స్వతంత్ర ఫ్రెంచి సేనలు వట్టుదలతో కాపాడుచుండిన బీరుహకీము పడిపోయిన పిదప, శత్రువు నైట్సుబ్రిడ్జి ఎల్ఆదం ప్రాంతములపై దాడి చేయ నారంభించెను. మిత్రమండలి సేనలును విమాన దళములును మూడు రోజులు తీవ్రంగా

యుద్ధంచేసిన పిమ్మట, నైట్సుబ్రిడ్జివద్ద కొన్ని స్థానాలను మనవారు విడువవలసివచ్చెను. అందుచే శత్రువులు ఆ మార్గాన సముద్ర తీరానికి పోగల్గిరి. బ్రిటిషు సేనాని జనరలు రిచీగారు నేర్పుగ తమ సైనికుల రెండు డివిజనులను గజాలా దక్షిణమునకు పంపివేసి, శత్రువు తమ మార్గాలు కోసివేయకుండా నిరోధింపగల్గిరి. నాల్గు రోజులవరకు శత్రువును రాకుండానేలనూ ఆకాశమార్గంకూడ ఆటంకపరచిరి. కాని జనరలు రిచీగారు తమ సేనలను ఎల్‌ఆడెం-ఎల్‌డుడా-సిడిరాజెగ్ ప్రాంతాలకు మరలించి సరిహద్దులందు కేంద్రీకరించియుంచెను. టోబ్రుకులో సరిపోతుందను కున్నంత సేనయుంచెను.

అదివరకు ఏడు నెలలు శత్రు ముట్టడిని నిభాయించుకొని నిలచియుండగల్గిన టోబ్రుకునగరం యిపు డేలాగు యింత వేగం పడిపోయింది? జర్మను ఆఫ్రికా సైనికదళం అత్యధికంగానుండి, ముట్టడి చేయుచున్న శత్రుసేనకు చాల తోడ్పడెను. జూను 13 వ తేది లిబియా యుద్ధంలో మార్పు కలిగించిన రోజు. ఆ రోజున మన 8 వ సైనికదళం చాల ఘట్టిదెబ్బ తిన్నది. దాని ముఖ్య ఆయుధశాఖ అంతా అక్రోమా - ఎల్‌ఆడం - నైట్సు బ్రిడ్జి యీ మూడుపురముల మధ్యనుండు త్రికోణంలో శత్రువుల ముట్టడిమధ్యనుండి కదలలేక పోయెను. 8 వ సేనకు విమాన సహాయం, టాంకులు ఫిరంగులుకూడ శత్రువుకి ఉన్నలాంటివే వచ్చి చేరినవి. కాని వాటి సంఖ్య శత్రువు సంఖ్యకన్న తక్కువ. శత్రువులకు గల మేలేమన వారి సంఖ్యాబలమే. సరిసమానమగు ఆయుధ పరికరాలుండి జరిగిన యుద్ధంలో ఏ మాత్రం గెలిచినా, ఆయదను చూచుకొని విశేష కాల్బలమును చొప్పించుచున్నాడు. 8 వ సైన్యం చాల నష్టపోయినప్పటికి, యింకను పాటుపోటుగనున్న లిబియా యుద్ధంలో తిరిగి శత్రువు నోడించుటకు తగియున్నదని చెప్పబడుచున్నది.

లిబియాలో యింకను యుద్ధం జరుగుచున్నదనియు, మిత్రమండలికి యింకను చాలబలమగు సేనలు గలవనియు అట్లీగారు కామన్సు సభలో నుడివిరి.

---

# జపాను సైనికోద్యోగి దినచర్య.

## భారతీయులగూర్చి అతని అభిప్రాయాలు

## తాము దేశీయులను ఎట్లు హింసించిరో తెలుపుట

బర్మా యుద్ధం ఎట్లు జరిగిందో ఇంగ్లీషువారు తెలిపిన కబుర్లు వినియున్నారు. వెనుకకు మరలుట, పొరపాటులుచేయుట, బాధలుపడుట, చనిపోవుట మున్నగు విషయములన్ని తెలుపబడినవి. పిల్లికి చెరలాట ఎలుకకు ప్రాణపోకట అన్నట్లు జపాను సైనికులకు యీ బర్మా యుద్ధం ఆనందంగా నుండియుండునని మీరనుకోవచ్చును. అట్లాకాదని "సిడ్నీ హెరాల్డు" పత్రిక యుద్ధ విలేఖరి రాస్తున్నాడు. వారికినీ చాల కష్టాలుండెను. వారూ పొరబాటులు చేసిరి. పైన బ్రిటిషు విమానాలు రొదచేస్తూవుంటే వారున్నూ నేల పరుండి, తమ వైమానికులు ఏమయ్యిరాయని విచారించిరి. ఎండ బాధ, కష్టాలగూర్చి మొరపెట్టి, ఒకప్పుడు నిరుత్సాహం చెందియే యుండిరి.

లెఫ్టనెంటు పదవిలోనున్న జపాను 55 వ డివిజను సైన్యంలోని గన్నరు సబాల్టర్న్ ఉద్యోగి యీ విషయాలన్ని తన డైరీ (దినచర్య) లో వ్రాసెను. అతడు పెగుచేరువను ఒక మరఫిరంగి చెంత చచ్చిపడియుండగా అతని జేబులో ఆ పుస్తకం దొరికింది. బర్మా యుద్ధంగూర్చి జపానీయుని డైరీ లభించింది యిదొకటే కావున ప్రకటించబడెను.

బ్రిటిషు గుండ్లు యీ ఉద్యోగిని చంపినవి. అతని డయిరీ చదివినందుకు మీరు తప్పక సంతసించెదరు. ఏమన, అతడు అందులో జంకులేకుండా తాము దేశీయులను ఎట్లు హింసించిరో ఎట్టి దారుణహత్యలు చేసిరో, యుద్ధ ఖైదీలను ఎట్లు చంపిరో, బర్మనులను భారతీయులను ఎట్లు బానిసలుగా జపాను యుద్ధ యంత్రాలకు కట్టి యీడ్చిరో తెలిపెను.

దీనంతటిలో తమ చక్రవర్తిని దేమునివలె పూజించడం, ప్రపంచాన్నంతా జపాను ఆక్రమిం

చుట విధియని నమ్ముకోడం, మున్నగు భావాలు స్పష్టంగా తెలుపబడెను. ప్రపంచాన్ని జయించాలను ఆశ, అది తమ విధియను విశ్వాసం యీ తూర్పుదేశపు పచ్చ నాజీలకు ఉండబట్టె, మూర్ఖ పట్టుదలతో రాక్షసత్వంతో పోరాడుచున్నారు. మనం వారి నోడించాలంటే ధైర్యంతోను, వారి వలె త్యాగంతోను, మనం మంచియని నమ్మిన వాటిలో ఎక్కువ విశ్వాసంతోను పోరాడవలసి యుండును.

ముందు పేజీలో అతని డైరీలో ఒక తల్లి, తండ్రి, నవ్వుచున్న జపాను యువతి బొమ్మలున్నాయి. కాని మొదటి పేజీలోనే అతడిట్లు వ్రాసెను— "వారిని మరచిపోవాలి. అందరు జపాను సామ్రాజ్య సేనకు నౌఖరులుగానుండాలి. అందరు చక్రవర్తి అధికారం నాల్గు సముద్రాలపై (అంటే ప్రపంచమంతా) పెంచుటకు కృషి చేయాలి".

భారతీయులు పిరికి పందలట.

తాము హాలివురేవునకు మడతరబ్బరు పడవల పై పోతిమని తెల్పుచు అతడిట్లు వ్రాసెను :— "మేము ఒడ్డుచేరగనే దేశీయులవద్దనుండి ఎద్దు బండ్లు తీసుకొంటిమి. కొందరు భారతీయులను కూలీలుగా రమ్మంటిమి. వారు ముందు యిష్టపడ లేదు. కాని నాతో చదివిన ఒక పట్టభద్రుడు, మొదటి తరగతి సిపాయి, కొందరు భారతీయ కూలీలను పొలాలఒడ్డునకు తీసుకపోయెను. చెప్పినట్లు వినక తప్పదనుకొని తక్కినవారు వెంటవచ్చిరి. భారతీయులు వట్టి పిరికిపందలు. బానిసలుగ నుండుటకు తప్ప ఎందుకు పనికిరారు.

"డిశంబరు 19 వ తేదీ మేము విక్టోరియా పాయింటు చేరితిమి. చేరగనే పెట్రోలు టాంకులు మండుట కనబడెను. శత్రువులు పారిపోయిరి. తరువాత కోసుముచేరితిమి. ఇక్కడ మిగిలియున్న దేశీయులు బయటకగుపడలేదు. కాని కొందరు స్త్రీలను సరదాగా బయటకీడ్చితిమి.

"క్రిష్టమసు ఉత్సవం జరుపుకుంటిమి. మేము త్సవంచేసిన బారకాసునందు అదివరకు బర్మనులు ఇంగ్లీషువారుండిరి. వారిని మా సైనికులు బంధించిరి. వారు యిట్లా వ్యవహారం మారినందుకు ఆశ్చర్యపోయిరి. కొందరు వెంటనే చంపబడిరి. తక్కినవారు తరువాత చంపబడుదురనుకుంటాను."

సయాం దుర్గతి.

1942 నూతన వత్సరాది యీ ఉద్యోగికి బాగా గడవలేదు. ఒక సయాం నౌకాదళోద్యోగితో పేచీవచ్చింది. "2602 ఉగాదికి నేడు స్వాగత మిచ్చేము. మధ్యాహ్నం తూర్పువైపు తిరిగి చక్రవర్తికి వినయపూర్వకమగు వందనము లర్పించితిమి. సాయంకాలం సయాం చక్రవర్తి కోటలో దేవాలయం చూపుటకు సిపాయిలను తీసుక పోతిని. ఈ పనిలో ఒక తాయి నౌకాదళోద్యోగి మాకు కలిసెను. తాయిలండు-జపానులు కలసియుండవలసిన అవసరంగూర్చి నేను చెప్పితిని. మేము ఇంగ్లీషులో మాట్లాడుకొంటిమి. చిట్టచివరకు తన మేలుకోసమే తాయిలాండు మా సామ్రాజ్యంలో చేరిపోక తప్పదని నేను వాదించితిని. అట్లనడం యుక్తంకాదేమో ! మేము విడిపోవువరకు కోపంతోనే యుంటిమి".

తరువాత రాతలో యీ ఉద్యోగి అమెరికా వైమానికులను కొనియాడెను. "మెసోటు విమానాశ్రయములందు మా విమానాలు మూడు, శత్రు విమానాలచే ఓడిపోయినవి. శత్రు విమానాలు అమెరికావారివి. అమెరికా వైమానికులు చాల నేర్పుగలవారు, ప్రశంసార్హులు.

"తరువాత ప్రయాణం చాల కష్టంగానుండెను, ప్రమాదకరంకూడాను. గుర్రాలపై బరువెక్కువై, త్రోవలో చాల చచ్చినవి. ఫిరంగులు రోడ్డుపై విడువవలసివచ్చెను. అప్పటికి మేము మ్యానాంగ్‌నకు సన్నని కొండదారిని చేరుచుంటిమి. అచట బర్మా సేనను మా అశ్వికదళం ఓడించెను. ఒక బ్రిటిషు లెఫ్టనెంటు శవం అందరికి కనబడునట్లు చెట్టుకి కట్టియుండుట మేము చూచితిమి. దీనిగూర్చి మేము అపహాశ్యం చేసితిమి. ప్రతిచోట బర్మనులు చాల స్నేహంగానున్నారు. మేము తామీనుడటు గ్రామం చేరగనే గ్రామీయులు మాకు కొబ్బరినీళ్లిచ్చి సత్కరించిరి.

"మేము తరువాత జాని నది దాటితిమి. దాటుటకు 7 గంటలు పట్టినది. మోల్మెనువైపు దాడి వెడలుచుండగా గుండ్ల వర్షం కురిపించబడెను. గుండ్లశబ్దం భూనభోంతరాళములను కదలించుచుండెను. జనవరి 31 వ తేదిన మేము మోల్మేనునందలి విమానాశ్రయం ఉత్తర కొన కొట్టి, దిగేస్థలం ముట్టడిచేసితిమి. పిడుగులవంటి

# విమాన యుద్ధం.



అమెరికాలో నిర్మింపబడిన ఎగిరే కోటవంటి పెద్ద బ్రిటిషు బాంబరు విమానం జర్మనీపై దాడిచేసి వస్తుండగా త్రోవలో శత్రు విమానాలు ఏడు ఎదిరించి కొట్టినను వంకవంకలుగా ఎగురుచు తిరుగుదెబ్బలు కొట్టి వాటిని తప్పించుకొని స్వదేశం చేరెను. ఆ యుద్ధం చూపుటకు చిత్రకారుడు రచించిన పటం.

---

ఫిరంగి గుండ్లు మమ్మెదుర్కొన్నవి. మా ఫిరంగుల కమాండరు గాయపడ్డాడు.

ఖైదీలను చంపుట.

" అందుకొరకై మావద్దనున్న ఒక ఖైదీ చంపబడెను. అతన్ని ముందుగ ఒక సిపాయి వెనుకనుండి సున్నీతో పొడచెను, సిపాయిల కిది వినోదంగానుండెను. అతడు వెంటనే చావలేదు. కాని ఖైదీలను చంపుటకు గుండ్లు వృధాచేయ గూడదు గావున, అతన్ని విడచి మేము మోల్మేను వైపు పోతిమి.

లూటీలో విశేషంగా తినుబడి వస్తువులు చేజిక్కినవి. ఆ రాత్రి బ్యాటరీ ఉద్యోగులు విందుచేసుకొనిరి. మరి ముగ్గురు యుద్ధ ఖైదీలగు శత్రువులను చంపితిమి. నది నీటిలో కలకలమున్నదని ఫిబ్రవరి 1 వ తేది ప్రాతఃకాలమున 4 గంటలకు మాకు హెచ్చరికవచ్చింది. భారతీయ సైనికులు బయటకు పారిపోదలచి యీదలేకుండా యున్నారు. అదీ ఆ కలకలము. మేము ఫిరంగులు ప్రేల్చి వారందరిని చంపివేస్తిమి.

" ఫిబ్రవరి 2 వ తేదీసరికి రెండురోజులనుండి మోల్మేనుచుట్టు యుద్ధరంగం ఊడ్చివేస్తున్నాము. దానినిండా శవాలే. ఏడు రోజులు గడచినపిదప నేను ఆర్డర్లీ ఆఫీసరుగానుండి మోల్మేను నగరం గస్తీ తిరుగుచుండగా, జర్మనులు, భారతీయులు లూటీచేయుట గాంచితిని. వారు ఆకలితో నున్నందున లూటీచేస్తున్నామని చెప్పిరి. వారిని తుపాకితో కాల్చి చంపితిని. శవాలను అక్కడే విడచియుందును కాని ఉష్ణప్రదేశంలో శానిటేషను పరిశుభ్రత గమనించక తప్పదు. "

మార్చి 2 వ తేది రాత యిట్లున్నది :—శత్రు విమానాలు తరుచు వచ్చి మాపై బాంబులువేయుచున్నవి. మాకు అనుమానం ఎక్కువయింది. మా వైమానికు లేమయినారా అని మాకు ఆశ్చర్యంవేసింది. "

మరునాడు :—" జపానులో అపుడే వసంత కుసుమాలు వికసిస్థాయి. ఇక్కడ బర్మాలో ఎండ మాడ్చేస్తున్నది. ఈదేశం అసహ్యామయినది, కంపు కుక్కలుండదగ్గది. దేశీయులు తెలివి తక్కువవారు.........శత్రు టాంకులపై నేను ఐదుచుట్లు గుండ్లు ప్రేలిస్తిని. ఎనిమిది తప్పించుకొన్నవి. అవి జపాను సైనికులు పెక్కండ్రను చంపినవి. యుద్ధంలో అవి చాల వినాశకరమైనవి. "

# జర్మనీ పరిశ్రమలను రక్షించుకొనుటకు తాపత్రయం.

## ఓడినా చిక్కులేని యేర్పాటులు.

జర్మనీ యీ యుద్ధంలో ఓడిపోయినా పరిశ్రమలకు నష్టంలేకుండా ఉండే యేర్పాటులను జర్మను పారిశ్రామికులు చేయదలంచిరి. జర్మనీ ఓడితే ఎంత ప్రమాదమో ప్రచురణశాఖ మంత్రి గోబెల్సుగారు చెపుతూవచ్చిరి. ఇపుడు జర్మను పారిశ్రామికులు ఒక్క తమ దేశంవారికేకాక ప్రపంచాన్నంతను ఉద్దేశించి ప్రచారం చేయసాగిరి. జర్మనీ ఓడిపోయినపుడు, తిరిగి గత యుద్ధానంతరంవలె వెర్సైలిసు సంధి షరతులు తెచ్చిపెడితే ప్రపంచమంతకు నష్టమేనని వారు చెప్పసాగిరి.

జర్మను పెట్టుబడిదారులును పారిశ్రామికులందరి ప్రతినిధియగు డాక్టరు మెతిసియసుగారు, తిరిగి జర్మనీయొక్క పరిశ్రమలను చంపి ఆర్థికదుస్థితి తెచ్చిపెట్టినచో గతయుద్ధానంతరం యిచ్చుకోవలసిన నష్టపరిహారం యివ్వలేనట్లే యిపుడుగూడ జర్మనీ యిచ్చుకోజాలక దివాలాతీయును, అపుడు ప్రపంచానికే నష్టమని సూచిస్తున్నారు. మంచి పరిశ్రమలున్న దేశాల మధ్యనే యిచ్చి పుచ్చుకొను వాణిజ్య వ్యాపారాలుండగలవనియు, మిత్రమండలి ఉద్దేశాలు నెరవేరి "శత్రు ప్రపంచం" దివాలాతీస్తే ప్రపంచమే పేదయగుననియు, అతనువ్రాసెను.

యూరోపులో జర్మనీ ఆక్రమించిన దేశాలందు పరిశ్రమలలో జర్మను పారిశ్రామికులు క్రొత్త హక్కులను అధికారములను సంపాదించుచున్నారు. బలవంతాన పరిశ్రమలను తీసుకపూర్తిగ వశపరచుకోడం వేరు. అట్లాగాక, యూరోపులోని చిన్న పెద్ద వ్యాపార సంస్థలు పరిశ్రమలు, బ్యాంకులన్నింటియందు జర్మనీ పెట్టుబడిదారులు భాగం పుచ్చుకొనుచున్నారు. న్యాయసమ్మతమగు విక్రయాధికారములను బడయుటకు ప్రయత్నించుచున్నారు.

యుద్ధానంతరం యీ న్యాయమగు తమ హక్కులను గెలిచే ప్రజాప్రతినిధి ప్రభుత్వములు అంగీకరించునని జర్మను వ్యాపారస్తుల అభిప్రాయం. ఉక్కు, రసాయనములు, వస్త్రములు, గనుల పరిశ్రమలన్నింటియందు జర్మను పారిశ్రామికులు జోక్యం కలుగజేసుకొనిరి. యుగోస్లావియాలో సీసం, రాగిగనులను, రుమేనియాలో చమురు గనులను జర్మను కంపెనీలు కొన్నవి.

జర్మను పారిశ్రామికులు ఒక క్రొత్త ఎత్తు వేసిరి. ఆక్రమిత దేశాలలో పరిశ్రమలయందు ఆర్థికంగా తాము జోక్యం కలిగించుకొని, వాటిలో ప్రాత పద్ధతులు మార్పించి జర్మను పద్ధతులను అనుసరింపజేసి, జర్మనీలోని కృత్రిమపట్టు, కృత్రిమ రబ్బరు యిటువంటివన్ని ఉపయోగింపబడునట్లు ప్రోత్సాహించుచున్నారు. ఇందువలన యితర దేశాలలో పరిశ్రమలు ఎక్కువ జర్మనీపై ఆధారపడవలసియుండును. జర్మనీ యుద్ధంలో ఓడిపోయినచో జర్మను పరిశ్రమలకు నష్టంకలిగి, గెలిచిన దేశాలతో పోరుచేయడం కష్టమగును. అందుచే యీ రీతిగా యూరోపు పరిశ్రమలందు కలిసిపోయినచో జర్మను పరిశ్రమలకు కలిగే నష్టం యితర దేశాల పరిశ్రమలకుగూడ కలుగును. జర్మనీ ఓడినచో, యీ యితర దేశాలందున్న పారిశ్రామికులు తమ నష్టం తప్పించుకొనుటకైనా, పరిశ్రమల నుద్ధరించుటకు తమ ప్రభుత్వములను బ్రతిమాలుకొందురు. తమతోను కలసి భాగస్వాములుగనున్న జర్మను పారిశ్రామికులకుగూడ నష్టంలేకుండా చేయగలరని, వారి ఆశ. ఈ యెత్తులు చాల ప్రమాదకరమయినవి. వీటి నెదుర్కొనుటకు ఆలస్యం చేయరాదు. ఇదొక ఆర్థికదాడి. నాజీల యితర దాడులవలెనే, యీ ఆర్థికదాడికూడ ఎదుర్కొనబడును. యుద్ధానంతరం జర్మనీ ఓటమితో, యితర దేశాల పరిశ్రమలపై జర్మనీచేసిన దాడికూడ నిరోధింపబడి, ఏర్పాటులన్ని రద్దుచేయబడును.

---

# రెండో రంగం - మూడో నేత్రం.

రాజ్యాలన్నీ, లోకాలన్నీ జయించాలనే కోరిక యీ నాడు హిట్లరుకు ఒక్కనికే కలిగిన కోరిక కాదు. పూర్వ యుగములలో హిరణ్యకశిపుడు మొదలైన రాక్షసులుకూడా ఇదే విధంగా విజృంభిస్తూ ఉండేవారు. అటువంటి క్రూరదానవుల ఘోర కార్యములున్నూ, రక్త దాహమున్నూ, హద్దుమీరినప్పుడు లోకోద్ధరణార్థం భగవంతుడు అవతారమూర్తిగా వచ్చి, రాక్షసులను సంహ

రించి, మానవకోటి తిరిగి స్వాతంత్ర్యము అనుభ వించేటట్లుగా అనుగ్రహించేవాడు. రాక్షసులు లోకాలను జయిస్తే, మత స్వాతంత్ర్యం అనేది నామరూపాలు లేకుండా చేసేవారు. హిరణ్య కశిపుడు ప్రహ్లాదుణ్ని అన్నివిధములుగా ఎందుకు హింసలపాలు చేసాడు? ప్రహ్లాదుడు హరిభక్తుడు - సర్వలోకాధిపతియైనవాడు హిరణ్యకశిపుడు కాడనియు, విష్ణుమూర్తియనియు నమ్మి హరి నామస్మరణ చేస్తూ ఉండేవాడు. మిగిలినవాళ్ల నందరినీకూడా హరినామస్మరణ చెయ్యవలసిన దని ప్రహ్లాదుడు బోధిస్తూ ఉండేవాడు. కాని, అటువంటి హరినామస్మరణ చేసినందుకు ప్రహ్లాదుణ్ని చంపివేస్తానని హిరణ్యకశిపుడు ప్రతిజ్ఞ చేసాడు. నిప్పులలో త్రోయించాడు. కత్తులతో పొడిపించాడు. ఏనుగులచేత త్రొక్కించాడు. కాని, ప్రహ్లాదుణ్ని చంపలేకపోయినాడు. ఆఖరుకు, హిరణ్యకశిపుడే, ఆ శ్రీ మహావిష్ణువు చేతిలో ప్రాణాలు విడిచాడు.

జర్మనీలో ఉన్న యూదీయ మతస్థులనందరినీ ఘోరమైన హింసలపాలుజేసి, వాళ్ల యిళ్లువాకిళ్లు సర్కారు తీసుకొని, వాళ్లు జర్మను బ్యాంకులలో దాచుకొన్న ద్రవ్యమంతా లాగుకొని, దేశములోనుంచి వాళ్లను పసిపిల్లలతో సహా పారదోలినాడు. ఆ విధంగా జర్మనీనుంచి తరిమివేయబడిన యూదీయ మతస్థులలో యీన్‌స్టేను అనే జగద్విఖ్యాతుడైన మహా పండితుడుకూడా ఉన్నాడు. ఆయన గొప్ప గణితవేత్త, గొప్ప తత్వవేత్త. మానవకోటికి జ్ఞాన నేత్రముల నీయగలిగినటువంటి నూతన సిద్ధాంతములను నిర్వచించాడు. అటువంటి జగదేక పూజ్యుడైన మహాపండితునికూడా జర్మనీనుంచి తరిమివేసినాడు. కారణమేమిటంటే ఆయన యూదీయ మతస్థుడు. ఇప్పుడు ఆ మహా మహుడు అమెరికా చేరినాడు. కాథలిక్కు క్రయిస్తవమతంకూడా తన జర్మనీ దేశములో తలయెత్తుకొని తిరుగుటకు వీలులేకుండా, కాథలిక్కు క్రయిస్తవులకుకూడా వారి మతారాధనల యందు అనేక ప్రతిబంధక నిబంధనలను హిట్లరు కల్పిస్తున్నాడు. ఈ విధంగా తన ఏలుబడి వ్యాపించినంతవరకు మత స్వాతంత్ర్యం అనేది లేకుండా హిట్లరు నిర్మూలిస్తున్నాడు.

మత స్వాతంత్ర్యం ఒక్కటే కాదు. అతడు నిర్మూలించేది. తాను జయించిన ఏ దేశంలో నైనాసరే, ప్రజలు తాము కోరిన పరిపాలనాపద్ధతిని తాము అనుసరించుటకు వీలులేదని నిర్బంధిస్తాడు. ప్రజలలో భిన్నాభిప్రాయాలు కలవారు తమ వివిధ రాజకీయపక్ష ప్రతినిధులద్వారా, శాసనసభలలో తమ అభిప్రాయముల నివేదించి, వోట్లు లెక్కపెట్టి, తీర్మానాలుచేసి, ఆ తీర్మానాల ప్రకారము, ఆ విధమైన ప్రజానిర్ణయము ప్రకారము, పరిపాలన సాగించడం హిట్లరుకు ఇష్టంలేదు. ఏ దేశంలోనైనాసరే ఒక్కటే పార్టీ, బాగా ఎక్కువగా పలుకుబడిగల పార్టీ, ఉండాలి. ఆ పార్టీయొక్క నాయకుడే సర్వాధికారం చలాయించాలి. అతనిమాట నిరంకుశంగా చలామణీ కావాలి. ఈ విధమైన నిరంకుశ నియంత ప్రభుత్వపద్ధతినే అవలంబించవలెనుగాని, ఇంకొక ప్రభుత్వ పద్ధతిని అవలంబించకూడదంటాడు. ఈ విధంగా రాజకీయ వ్యవహార సిద్ధాంతములలో ప్రజలకు స్వాతంత్ర్యం ఉండకూడదంటాడు. రష్యాలో సామ్యవాద పద్ధతి ఒకటి అమలులో ఉన్నది. రష్యాదేశములోని ప్రజలకందరికీ, కావలసిన ఫ్యాక్టరీలు వగైరా పరిశ్రమాగారములన్నియు ప్రయివేటు వ్యాపారస్థుల వశమైయుండుటకంటె ప్రభుత్వమువారే పరిశ్రమలనన్నింటిని నిర్వహించవలెనని రష్యను ప్రభుత్వం నిర్ణయించింది. వ్యాపార వాణిజ్యముల కృషి పరిశ్రమలు ప్రభుత్వమువారే నిర్వహించవలెననిన్ని రష్యాలో ఒక సిద్ధాంతం అమలుపరచి ఆ ప్రకారంగా ప్రభుత్వ పరిపాలన సాగిస్తున్నారు. రష్యాలోని ప్రభుత్వపద్ధతి అక్కడి ప్రజల ఇష్టానుసారంగా సాగుతోంది. కాని, ఆ పద్ధతి తనకు ఇష్టంలేదనిన్నీ, దానిని నిర్మూలించేవరకు తాను నిద్రపోను అనిన్నీ, రష్యాపై తనకుగల ద్వేషమును హిట్లరు చిరకాలంనుంచీ ప్రకటిస్తూనే ఉన్నాడు. సంకల్పించిన ప్రకారంగానే, రష్యాపై సమరంకూడా సాగించాడు. తాను మెచ్చిన నాజీ నిరంకుశ ప్రభుత్వ పద్ధతి తప్ప, ప్రపంచంలో ఇంకో పరిపాలనా పద్ధతి ఉండకూడదని హిట్లరు వాదిస్తాడు. రాజకీయాభిప్రాయ స్వాతంత్ర్యంగాని, మత విషయములలో స్వాతంత్ర్యంగాని ఎవరికీ ఉండకూడదని వాదించి, లోకాన్ని బాధిస్తున్నాడు. రష్యాలో ఉన్న ప్రభుత్వపద్ధతి, రష్యాలోని ప్రజలు ఏరికోరి ఏర్పరచుకొన్న పద్ధతిగదా. వాళ్ల ప్రభుత్వ పద్ధతిని నిర్మూలిస్తానని శపథంపట్టి, వాళ్లను సర్వనాశనం చేయడానికీ పీడెవడు? రష్యావాళ్లు తన కేమి అపకారం చేసారు? రష్యామీదకు తాను

కత్తికట్టి దండెత్తవలసిన తగాదా తనకు రష్యాతో ఏమైనా కలిగినదా? తనకు రష్యా చేసిన అపకారం కించిత్తుకూడా లేదు. అయినప్పటికీ, రష్యాలోఉన్న సామ్యవాద ప్రభుత్వ పద్ధతిని నిర్మూలించడమే తన సంకల్పమనిచెప్పి రష్యాపై హిట్లరు యుద్ధం సాగించాడు. కాబట్టి, ప్రపంచంలో ఏదేశంలోనైనా సరే, ప్రజలకు రాజకీయ వ్యవహార స్వాతంత్ర్యం లేకుండా నిర్మూలించవలెనని౯్ని, మత స్వాతంత్ర్యం లేకుండా నిర్మూలించవలెననిన్ని కత్తికట్టి, కదనరంగ విహారం చేస్తున్నాడు యీ హిట్లరు.

ఇటువంటి ప్రపంచవిలయం రావడానికి యీ హిట్లరు మూలకారణంగా ఉన్నాడు. అతనిని అనుసరించిన జర్మను నాజీ సేనలు మూలకారణంగా ఉన్నాయి. మానవకోటి తల్లడిల్లిపోతోంది. కాని, మిత్రమండలి రాజ్యాలకు భయము లేదని అమెరికా ప్రెసిడెంటయిన రూజువెల్టుగారు అభయహస్త మిచ్చుచున్నారు. అమెరికాతో యుద్ధం అంటే, హిట్లరుకు అంత్యం సిద్ధం అన్నమాపే. ఆ మాట ఇదివర కొకమారు, హిట్లరే అన్నాడు. "అమెరికాతో అక్షరాజ్యాల యుద్ధం ఆఖరు అధ్యాయంగా జరుగుతుంది. అది దేవదానవుల యుద్ధమేగాని మరొకటి కాదు." అని హిట్లరు అన్నాడు. బ్రిటిష్ ప్రధాని చర్చిల్లుగారు మొన్న అమెరికా వెళ్లియున్నారు. రూజువెల్టుగారితో మాట్లాడుతున్నారు. జర్మనీని జయించుటకు మార్గమేది అని ఆలోచిస్తున్నారు. అటు రష్యాతో తూర్పున జర్మనీ పోరాడుచుండగా, జర్మనీని పడమటి వైపునుంచి కొట్టవలెనని ఆలోచనలు జరుగుతున్నాయి. దీనినే రెండో యుద్ధరంగం ఉపక్రమించడం అంటారు. రూజువెల్టుగారు రుద్రరూపం దాల్చుచున్నారు. రూజువెల్టుగారు రూక్షణవీక్షణాలతో కర్తవ్యం ఆలోచిస్తున్నారు. రూజువెల్టుగారు తన జ్ఞాననేత్రం తెరిస్తే చాలు. రెండో రంగం ఉపక్రమించినట్లే—మూడో కన్ను తెరచినట్లే—శత్రువు అంత్యదశ మూడి మాడినట్లే.

## మద్రాసు పటాలముల జనహాని.

మదరాసు పటాలములో యీ దిగువ జనహాని కలిగిందని తెలుపుటకు విచారించుచున్నాము :—

చనిపోయినవారు.

| నెంబరు. | హెూదా. | పేరు. |
|---|---|---|
| ఆర్ ఐ.ఎ ఎస్.సి. | | |
| 899891 | సిపాయి .. | శంకరయ్య. |
| ఐ.ఎ ఒ.సి. | | |
| సి సి. 4601 | గుమాస్తా ... | ఎస్ ఎస్ రాజు. |

గాయపడినవారు.

| నెంబరు. | హెూదా. | పేరు. |
|---|---|---|
| ఐ ఎ ఒ సి. | | |
| 0/31095 | సిపాయి . | కె ఎస్. పెరుమాళు |
| ఐ జి ఎస్ సి. | | |
| జి ఎస్ ఎఫ్ / 7634 | ఎం. డబ్ల్యు. .. | కన్నను నారాయణ స్వామి. |

కనబడనివారు.

| నెంబరు. | హెూదా. | పేరు. |
|---|---|---|
| ఆర్.ఐ ఎ.ఎస్ సి | | |
| 766886 | పి.ఎ.ఎల్ /నాయక్. | పి కుంచన్ని. |

## సైనికుల ఔదార్యం.

అలసియున్న సైనికులు తమ బండ్లను గతిశూన్యుల కిచ్చుట.

సాధారణ బ్రిటిషు సైనికులు కష్టకాలమునందు ఎంతటి ఔదార్యము సోదరభావము భారతీయులయెడ చూపి తమ బాధ్యత నిర్వహింపగలరో నేను స్వయంగా చూసిన దాన్నిబట్టి చెప్పగలను. అని భారతీయసైన్యం వెంటనున్న ఒక విలేఖరి అస్సాం సరిహద్దునుండి వ్రాస్తున్నాడు.

ఐదు నెలలనుండి బర్మాలో యుద్ధంచేయుచు అలసియున్న మన సైనికులు చివరకు అస్సాం రాష్ట్ర సరిహద్దును దాటిరి. వర్షాలకు త్వరగ చెడిపోవుచున్న మణిపూరు రోడ్డుపై వారిని మరి కొంత లోప్రదేశానికి తెచ్చుటకు మోటారు లారీలు పంపబడినవి. కాని వారాబండ్లు ఎక్కు సమయానికి క్రొత్తగ మరి 2,000 మంది భారతీయులు బర్మానుండి కాందిశీకులు వచ్చిచేరిరి. వెంటనే సైనికులు తమ మోటారుబండ్లను కాందిశీకులకు యిచ్చివేసిరి. ఆ రోడ్డుపై కొత్తబండ్లను పంపుటకు వీలులేదు కనుక, యిదివరకే అలసియున్న యీ సైనికులు 46 మైళ్లు కొండదారియైనప్పటికి, వాన కురుస్తున్నప్పటికి నడక ప్రారంభించిరి.

వారిలో ఒకని కాలు పగిలి, జ్వరంతో ఒళ్లు పచ్చబడియుంది. పలాలుపురం చేరినపిదప అతన్ని నేను ప్రశ్నించగ :—"కాందిశీకులలో వారి స్త్రీలు బిడ్డలుకూడ నున్నారు. వారికి బండ్లు మాకన్న ఎక్కువ అవసరం. వారు మాకన్న హీనస్థితిలో నున్నారు," అని అతడనెను.

MADRAS: PRINTED AND PUBLISHED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.